# కపిల మహర్షి జీవిత చరిత్ర

✍️. సద్గురు శివానంద మూర్తి
📚. ప్రసాద్ భరద్వాజ




- **వంశము:** కర్దమ(తండ్రి), దేవహూతి(తల్లి)
- **భార్య(లు):**
- **కుమారులు/కుమార్తెలు:**
- **కాలము:** ద్వాపర యుగం
- **భౌగోళిక ప్రాంతములు:** సిద్ధప్రద
- **నదులు:**
- **బోధనలు/గ్రంధాలు:** సాంఖ్యయోగం, షష్ఠి తంత్రము, కపిలస్మృతి
- **జ్ఞానం:**

1. సాక్షాత్తు విష్ణువే కపిలుడిగా పుట్టడంచేత కర్దముడు కపిలునితో "నేను యోగసమాధిని అనుష్ఠించి నిన్నుధ్యానం చేసుకుంటూ ఏకాంతవాసానికి తరలిపోతాను. అనుజ్ఞనివ్వు" అని అడిగాడు. అందుకు కపిలుడు, "మునీంద్రా! నా జన్మకు కారణం ఏమిటంటే మునులందరికీ యోగమార్గాన్ని చూపించటమే! అందుకే నేను ఈ లోకానికి వచ్చాను. నీకోరిక మన్నించటం కోసం మాత్రమే కాదు,

లోకానుగ్రహ కాంక్షతో నేనుఇక్కడికి వచ్చాను. నా కార్యాన్ని తత్త్వబోధతో కొనసాగిస్తాను. అందరికీ తత్త్వబోధ చేస్తాను. సకల కర్మలలోనూ నీవు సన్యసించి, అంటే నీవు కర్మను వదిలిపెట్టి, నన్నే భక్తితో ఆరాధించు. ముక్తిని పొందుతావు" అన్నాడు.

2. కపిలుడు తల్లికి ఆత్మబోధ ఇలా చేసాడు "జీవుని చిత్తమందు ఈ సంసారము త్రిగుణమయంగా ఉండటంచేత బంధనము కలుగుతోందని, ఆ చిత్తమందే – నిర్గుణమయిన బ్రహ్మ పదార్థంపై ధ్యానం అవసరం లేకుండా నారాయణాశ్రితంగా – అంటే,నారాయణుని ఆశ్రయించే చిత్తముండేటట్లు అలవాటు చేసుకున్నట్లయితే, మోక్షం లభిస్తుంది" అని బోధ చేసాడు.
3. యోగియొక్క స్థితి ఎమిటంటే, "వాక్పాణి పాయూపస్థలనేవి ఏవయితే శరీరంలో ఉన్నవో, వాటికి యోగిశరీరంలోస్థితిలేదు. అంటే అవి విషయములను విసర్జించవు, స్వీకరించవు. అంతర్ముఖుడైన యోగిని ఇంద్రియాలు బాధించవు. కాబట్టి వేదకర్మలనుంచి అతనికివచ్చే సుఖముకానీ, ఆచరించకపోతే వచ్చే దుఖముకాని ఉండవు. ఈ నవద్వారాలను మూసివేయగలిగినట్టి వాడెవడైనా ఉంటే, అటువంటి ముధునకు – అటువంటి యోగికి – తపోదానవ్రతములుకాని, వేదప్రామాణ్యముకాని కావలసిన పనిలేదు.
4. వేదములే లోకములకు ప్రమాణములు. శబ్దబ్రహ్మ, పరబ్రహ్మాలలో – శబ్దబ్రహ్మావలన పరబ్రహ్మమును గ్రహించవచ్చును. 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అని పరబ్రహ్మ వస్తువును గురించి శృతి చెపుతున్నది. బ్రహ్మవస్తువును మనసుతో పొందటానికి వీలులేదు. 'యతోవాచో వివర్తంతే' – అంటే అక్కడ పదములు భాష, వాక్యములు దానిని నిర్దేశించలేవు. వాటికా శక్తిలేదు. కానీ మానవభాష, మానవజీవితానికి కావలసినటువంటి విషయములను సుసంపన్నం చేస్తుంది. కానీ అగోచరమయిన బ్రహ్మవస్తువును భాషచెప్పగలుగుతుందా? చెప్పలేదు. వేదము దానిని గురించి ఎంతయినా మాట్లాడుతుంది. కానీ దానిని తను చూపించలేదు. వేదమును శబ్దబ్రహ్మము అని భావించాలి. అంటే నిర్గుణమైన బ్రహ్మవస్తువు (వాక్కు, మనస్సులకు అతీతంగా ఉన్నది) శబ్దరూపంలో వేదంగా పరిణమించి ఇలా వచ్చింది. వేదాధ్యయనం చెయ్యటంచేత, వేదాన్ని నమ్మటంచేత బ్రహ్మమునే నమ్ముతున్నానని భావిస్తే; అదేవిధంగా ఇదీ మార్గమవుతుంది అని చెప్పాడు.

5. శబ్దబ్రహ్మభావనయందు వేదాధ్యయనంచెయ్యమని చెప్పిన అర్థం దాంట్లోసిద్ధిస్తోంది. అది క్రతువులకు కారణం అవుతుంది. దానివల్ల వర్షం వస్తుంది. సంతానం కలుగుతుంది. పశువులు కలుగుతాయి. శత్రుక్షయమవుతుంది. ఏ ప్రకారంగా చేసే వేద విచారణ, వేదాధ్యయనం, వేదాచరణ ముక్తిహేతువు కాజాలదు.దానిని ఏలావాడుకోవాలంటే, అది శబ్దబ్రహ్మ అనే భావనలో ఉంటే – 'ఓం' అనే ప్రణవాన్ని శబ్దబ్రహ్మగా భావిస్తే కలిగే అనుభవం అది. 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'- అంటే, ఒకటే అక్షరం అది. బ్రహ్మవస్తువది. ఆ భావనతోటే ప్రణవాన్ని ఉచ్చరిస్తే మంచిది. అప్పుడు పొందబడే వస్తువు పొందబడుతుంది. అలాకాక, కేవలం నోటితో అంటే, లభించేది కాదది. ఏందుకంటే, అలాచేసినప్పుడు నోరు అరుస్తుందేతప్ప నోటికేమీ జ్ఞానం లభించదు. అనుభూతి జీవిడికి చిత్తము ద్వారా లభిస్తుంది. చిత్తమనేటటువంటి ఒక ద్వారం ఉన్నది. అది జీవాత్మ అని అనబడుతున్నది. చిత్తాన్ని ధరించటంచేత జీవాత్మ అనబడుతున్నది. చిత్తాన్ని భేదించి లోపలికి ఈ బ్రహ్మ వస్తువును ప్రవేశపెట్టగలిగితే; చిత్తభేదనం జరిగి ఆత్మవస్తువుకు బ్రహ్మవస్తువుయొక్క స్పర్శచేత బ్రహ్మజ్ఞానం సిద్ధిస్తుంది. ఇది ఒక పద్ధతి. అలావేలకొద్దీ మార్గములు చెప్పారు. బ్రహ్మణులు ఉత్తములై, వేదబోధిత కర్మలను అనుష్ఠిస్తూ శాశ్వతపదమును పొందవచ్చును. పురాణాల్లో 'బ్రహ్మణ' శబ్దం యెక్కడ వచ్చినా ఋషులనే అర్థం. ఋషులు అనేటువంటి అర్థంలోనే ఆమాట వాడతారు.
6. కాబట్టి – బ్రహ్మజ్ఞానం ఎవరికయితే ఉంటుందో – వాళ్ళు బ్రహ్మణులు అనబడతారు. వేదం చదువుకోవటంచేత అతడు ద్విజత్వాన్ని సార్థకంచేసుకుంటాడు. ఉపనయనసంస్కారాలచేత ఆ తరువాత వేదం ఎందుకు వాడుకోవలెనో అది మాత్రమే తెలుసుకొని అందుకుమాత్రమే వేదాన్ని ఉపాసనచేసినవాడు విప్రుడనబడతాడు. విప్రత్వం అంటే వేదములను సక్రమంగా వాడుకొని విరాగియై, జ్ఞానమార్గంలో ఉండి సద్బ్రాహ్మణుడిగా సమస్తకర్మలనూ ఆచరిస్తూ, మోహబుద్ధి లేకుండా పరమాత్మను తన దృక్పథంలో పెట్టుకొని ఆచరించటము. విప్రుడు, విప్రోత్తముడు, బ్రాహ్మణుడు, అని అతనికి పేరు. అది కులంకోసం ఏర్పడ్డది కాదు.
7. వేదంయొక్క తాత్పర్యం ఏమిటోగ్రహించి, తెలుకోదగినది ఏదో, దానినివెతుక్కుంటూ ప్రయాణించే వాళ్ళు వేదజ్ఞులని అనబడతారు. అలా కానివాళ్ళు వేదపాఠకులు అనబడతారు. ఈ ప్రపంచమంతా

వేదమందున్నది. వేదంలోనే అది ఉనికిని కలిగి ఉన్నది. కాబట్టి అట్లాంటి వేదమార్గములలో ఉండేటటువంటి బ్రహ్మణులకు నేను కూడా నమస్కరిస్తాను అని కపిలుడు అన్నారు.

8. పోయినజన్మలో మనం ఏదో పుణ్యంచేస్తాము. సిరిసంపదలు అన్నీ వస్తాయి. భార్యాపిల్లలందరూ బాగుంటారు. సంతోషమే. దానిని అనుభవిస్తున్న సమయంలో సత్త్వగుణంతో, అంటే సత్త్వగుణప్రధానుడై అనుభవించాలి. దర్పంతో ఇదంతా తన ప్రయోజకత్వం అనే భావంతో కాదు. ఇతరులను తిరస్కరించి కాదు. ఇతరులను అవమానించి తాను ధనవంతుడినని విర్రవీగకూడదు. ఈ సంపదలన్నీ క్షణికములనే మాటగుర్తుపెట్టుకుంటూ వాటిని అనుభవించాలి. ఎందుకంటే, తనుండగానే తన పుణ్యం ఖర్చయిపోయి సంపదలన్నీపోతాయి. సంపదలుండగానే ఆయుర్ధాయం అయిపోతే, తనుపోతాడు.కాబట్టి ఎలాగూ వియోగం తప్పదు. ఈ రెండు విషయములలోకూడా సంపదయొక్క అనుభవం క్షణికమే! ఏడుతరాలు అనుభవించగలిగిన ఆస్తి ఉండవచ్చు. కాని వ్యక్తియొక్క అనుభవము క్షణికంమాత్రమే.
9. అందుకనే జ్ఞానభిక్షపెట్టమని గురువును ఆశ్రయించాలి.' ఈ క్షణికమయిన జీవితంలో అనుభవించటానికి అన్నీ ఉన్నాయి కాని, అనుభవించటంకోసమని నేనుండటంలేదు. నేనూ ఉండను-అవీ ఉండవు. అందువలన నాకు మార్గోపదేశం చెయ్యి' అని ఆర్తితో గురువును ఆశ్రయించి మోక్షమార్గాన్ని అర్ధించేవాళ్ళు మూడురకాలుగా ఉంటారు. వాళ్ళే అంకురితులు,పుష్పితులు,ఫలితులు. జీవితంలో ఏమార్గాన్ని ఆశ్రయించి జ్ఞానాన్ని పొందుతారో వాళ్ళనే ఫలితులు అంటారు. ముక్తిఫలంపొందినవాళ్ళు ఫలితులు.
10. మోక్షధర్మమందు ఆపేక్షమాత్రం కలిగి, ఆ ఆపేక్ష అంకురించిన హృదయంతో ముక్తిమార్గం అన్వేషిస్తేచాలు. ఎలాగైనా, యెప్పటికైనా నా కోరిక తీరుతుందేమో! గురువు లభిస్తాడెమో! ఎప్పటికైనా ఈ సంసారంలోంచి నేను బయటికి రాగలుగుతానేమో! అనేటువంటి దీక్ష, కోరిక కలిగినవాళ్ళు అంకురితులు. ఆ తపస్సులో ప్రవేశించి సాధనచేస్తున్నవాళ్ళు పుష్పితులు. ఇలా మూడురకాలుగా ఉన్నారు.
11. "వీళ్ళంతా గురుబోధిత జ్ఞానము వలన మోక్షాన్ని పొందుతారు. గురువు-ఇది మార్గమని, ఇది గమ్యమని, ఇది కర్తవ్యమని చూపిస్తాడు. ఆ తరువాత నీకు

కర్తవ్యం లేదు. వెనక్కు తిరిగి చూడకు. ఈ సంసారంయొక్క అర్థం ఇంతకన్నా లేదు. ఇది వ్యర్థమయినటువంటిది. నీవు అటుచూడవద్దు. నీకు ఏవో ధర్మాలున్నాయని అనుకోవద్దు. మోక్ష మార్గంలో వెళ్ళేవాడికి ధర్మాలున్నాయని జ్ఞానపకం రాకూడదు. అది పతన మవుతుంది" అని కపిలుని బోధ. ముక్తిమార్గంలో వెళ్ళి అందులో ఉండే వాడికి, అందులోకి వెళ్ళిపోయిన తరువాత, ఇతర ఆలోచనలుండకూడదు. 'ఏమిటో సన్యాసాస్రమం తీసుకున్నానుకాని చిన్నపిల్లకు పెళ్ళిచేయలేదూ ఇట్లాంటి ఆలోచనలేవీ ఉండకూదదు. వాటివలన భ్రష్టత్వం వస్తుంది. ఒకానొక సమయంలో కలిగిన తీక్షణమయినటువంతి వైరాగ్యప్రవృత్తిలో వెళ్ళిపోతే, మరి వెనుతిరిగి చూడకూడదు.

12. మనుష్యుడుకి(జీవుడికి) కర్మ,భక్తి,వైరాగ్యము,జ్ఞానము,యోగము అనేటటువంటి ఐదు పరిణామాలు ఉంటాయి. పరాయ పరరూపాయ పరమాత్మన్ పరాత్మనే నమః పరమతత్వాయ పరానందాయ ధీమహి

13. "పరాత్పరమైనటువంటిది బ్రహ్మావస్తువు. దానికే నమస్కరించు. ఈ మధ్యలో దేనికీకాదు. ఈ జగత్తులోపొందే ఆనందానికి పరమై ఉండేటటువంటి ఒకానొక ఆనందస్వరూపమయినట్టి వస్తువు అది. పరమాత్మ దర్శనంచేత కలిగేటటువంటి ఆనందానికి హేతువేదో, అది లోకాన్ని తరించిన తరువాతకలిగే ఆనందాన్నిచ్చేది. ఈ లోకంలో ఆనందదాయకమయిన వస్తువులు అనేకం ఉన్నాయి. ఆ వస్తువులు లభిస్తే ఆనందం-లేకపోతే దుఃఖం కలుగుతవి. లోకాన్ని తరించి బయటికి వెళ్ళిన తరువాత పరమాత్మవస్తువు యొక్క భావనచేత కలిగే శాశ్వతమయిన, నిరంతరమయిన ఆనందానికి అవధిలేదు. నిరవధిక ఆనందం అది. ఇంత అని చెప్పటానికి వీలులేదు. దానికొకహద్దు లేదు. ఒకనాటికి అదితరిగిపోయేది కాదు. పరమాత్మయొక్క సాన్నిధ్యంలో పొందినటువంటి ఆనందం నిరవధికంగా ఉంటుంది. ఈ లోకంలో ఉన్నంతకాలం ఉండే ఆనందం అవధి కలిగినటువంటిదే! ఏ వస్తువయినా ఆనందాన్ని కొంతకాలమే ఇస్తుంది. అవధి కలిగినటువంటి ఆనందాలు ఈ లోకంలో చాలా ఉంటాయి.

14. మనము గంగాస్నానము చేస్తాము. గంగాస్నానము పాపక్షయకరమేకాదు; చచ్చిపోయినతరువాత జీవునియొక్క బూడిదకు గంగస్పర్శ కలిగితే, జీవుడు లేకపోయినప్పటికీ-పూర్వశరీరంలో ఉండిన జీవుడు, ప్రేతరూపంలో ఉన్నప్పటికీకూడా-ముక్తినిపొందుతున్నాడు.
ఈ ఆర్యరహస్యము యెవరికీ అర్థంకానటువంటిది. అసలు ఎలాగ అర్థం

అవుతంది! ఏమిటి దీని అర్థం! తకంతో చెపితే తెలిసే విషయంకాదది.అసలు తర్కమేలేదు దీనికి. ఏనాడయితే మనం ఆర్యసంస్కృతిలో ఉన్న మౌలికసూత్రాలను, ధర్మాలను ప్రశ్నించకుండా విశ్వసంతో నమ్మటానికి అలవాటు చేసుకుంటామో,అప్పుడే మనకు భవిష్యత్తు ఉన్నది. మన బుద్ధి కుశలతచేత దానిని పరీక్షించి, దానికి మన తర్కాన్ని అన్వయించి, "నా తర్కానికి ఇది నిలబడింది. కాబట్టి ఇది సత్యమే" అనుకుంటే; మనకు తెలిసిన తర్కం, మనకుండే విజ్ఞానం చాలా తక్కువ. దానిని పరీక్షించేందుకు మనము అధికారులమే కాదు. మనకు ఉండేటటువంటి యుక్తి, బుద్ధికుశలత చాలా అల్పం. కాబట్టి గంగ అనేటువంటి వస్తువు అప్పటికీ ఇప్పటికీ, ఎప్పటికీ కూడా పవిత్రమయినదే! యజ్ఞంలో మనం గంగోదకం చల్లుకొని పవిత్రులమవుతున్నాము. గంగకటువంటి శక్తి ఉంది. జీవితంలో ఒక్కమాటైనా గంగాస్నానం చేసితీరమని ప్రతి భారతీయుడికీ పెద్దలు చెప్తారు. అయితే కొందరు, "గంగ అపవిత్రంగా ఉందండీ!" అంటారు. అయ్యా! మురికిఉందికాని అపవిత్రంగాలేదు" అని సమాధానం చెప్పాలి.అది ఎలాగ అంటే "నీవు వెళ్ళి ఆ యోగికి నమస్కారం చేసావుకదా! నీ శరీరంలో ఉన్నట్లుగానే ఆయన శరీరంలో కూడా మనమూత్రాలు ఉన్నయి. ఆయనకెందుకు నమస్కరించావు? ఆయనలో రక్తమాంసాలు, చర్మము క్షీణించి అందంగాకూడా లేడాయన. కేవలం సుందరమైన దేహంతో, రూపంతో అందంగా ఉన్నాడని నీవు ఎవడికైనా నమస్కారం చేస్తావా?" అని అదిగితే, ఏమిటి సమాధానం.

15. కాబట్టి బయటికి కనబడేటటువంటి శుభ్రత, అశుభ్రత అనేటటువంటివి భౌతికమైనవి. 'పవిత్రతా అనేది దీనికి పైన, వెనుక ఉండేటటువంటి రహస్యం. అది ఒక తత్వం. ఆ తత్త్వానికే మనం మొక్కుతాము. గంగానదిలో ఎంత మురికి ఉన్నా పవిత్రమయినదే! అలాగని మురికిచేస్తే ఫరవాలేదు అని అనటం లేదు.అంత పవిత్రమయిన గంగను మురికిచెయ్యటం పాపంగా భావించాలి మనం. కాబట్టి అది శుభ్రంగా లేకపోవచ్చు గాని, 'పవిత్రం'గానే ఉంది. అదీ ఆ రెండింటికీ ఉన్న తేడా. నీళ్ళు శుభ్రంగా ఉంటే ఇంట్లో స్నానం ! చేస్తాము.సబ్బుపెట్టుకొని, చక్కగా వేడినీళ్ళు పెట్టుకొని చేస్తాము. ఆ నీళ్ళను పవిత్రమయినవి అంటామా! శుభ్రంగా ఉన్నాయి అనిమాత్రమే అర్థం. ఆ రెండస్తులలో ఆర్యుడు ప్రతీవస్తువునూ చూస్తాడు. భౌతికస్థితి, తాత్త్వికస్థితి అని రెండు దృక్పథములు ఉన్నాయి ఆర్యులకు. అది గుర్తుపెట్టుకోవాలి.

16. ఒకప్పుడు ప్రశ్నలు పుట్టేవికావు. కృష్ణుడి రాసక్రీడయందు అవినీతి లేదా? అనేప్రశ్న పూర్వం ఎవరూ అడగలేదు. ఇప్పుడు అడుగుతున్నారు. ఎలాఅడుగుతున్నారు అంటే, అధికారంలేకుండా అడుగుతున్నారు. కృష్ణుడు అవినీతిపరుడు, అవినీతిలో సంచరించాడు అనేమాట అనేముందు మనం ఎంతటి అవినీతిలో ఉన్నామో ఒక్కమాటు గుర్తుచేసుకుంటున్నామా! మనను మనం అలా ప్రశ్నించుకున్నామా? మనసా, వాచా, కర్మణా అంత నీతిమంతులుగా ఉన్నామా మనం! ఆ ప్రశ్న వెయ్యటానికి మనకీ అధికారం ఎక్కడినుంచి వచ్చిందనేది మొదటిప్రశ్న! సమాధానం తరువాత. **అధికారంలేకుండానే ప్రశ్నడగటం నేర్చుకోవటంచేతనే, ఆర్యధర్మం ఇలా అవమానం పాలవుతోంది. ప్రతీవాడినీ ప్రశ్నించవచ్చు. తప్పుకాదు. కాని అలా అడిగేముందు – అతడి ప్రవర్తనలో వక్రత్వాన్ని దూషించేముందు, ముందర మన ప్రవర్తన సక్రమంగా ఉంటేనే అలాగ అడగతానికి వీలవుతుంది.**
17. మనిషితో ఏంచేసినా తప్పే! సాక్షాత్తు భవంతుడువరమిచ్చినా సందేహిస్తాడు. “ఈయన వరమిచ్చాడు, నిజంగా అవుతుందా?” అనుకుంటాడు. ఇవ్వకపోతే, “స్వార్థపరుడు, డబ్బిస్తే ఇస్తాడేమో, ఈపనులన్నీ చేస్తాడేమో!” అని అనుకుంటాడు.ఏంచేసినా మనుష్యుడిని రంజింపచెయ్యలేరు. ‘నరం నరంజయతి బ్రహ్మోపీ – బ్రహ్మ కూడా నరుడిని రంజింపచెయ్యలేడు అని ఒక వాక్యంకూడా ఉన్నది.
18. ఈశ్వరునియొక్క ప్రతిపాదన ఎలాగ ఉన్నదంటే – కృష్ణచరిత్ర లోని రాసలీలలో అంతాకూడా; కోరేవాడు,పొందేవాడు,అనుభవించేవాడు మనుష్యుడేనని అర్థం. మనుష్యుడు ఏదికోరుతాడో అదేపొందుతాడు, అదే అనుభవిస్తాడు. ఇది మనుష్యుడియొక్క లక్షణమేతప్ప ఈశ్వరుడు దేంట్లోనూ కర్తకాడు. ఈశ్వరుడియొక్క స్థితి ఎలాఉందంటే – ఇచ్చేవాడు కాదు, చేసేవాడుకాదు, తీర్చేవాడుకాదు; ఇవ్వననేవాడుకూడా కాదు. ఆయన తటస్థంగా ఉంటాడు.
19. మనుష్యుడు శృంగారభావంతోగాని, శత్రుభావనతోకాని, ప్రేమ భావనతోకాని, భక్తిభావంతోకాని ఆయన దగ్గరికి వెళ్ళినప్పుడు; వాళ్ళు ఆ పరమాత్మను తమవంటి మరొక వ్యక్తిగా పొందుతారు. దాతగా చూస్తారు. సంహర్తగా చూస్తారు. ద్వేషంచేత వెళ్ళి తనను అతడు చంపుతున్నాడనే భావనతో చచ్చిపోతారు. అనుగ్రహిస్తున్నాడనే భావంతో అనుగ్రహించబడి, ఆనందాన్ని పొందుతారు. మోహంతో ప్రేమతోవెళ్ళి, అతడు తనను భర్తగా స్వీకరించాడనే భావం వీళ్ళు

పొందుతారు. ఏయే భావంతో జీవుడు ఈశ్వరుణ్ణి చేరతాడో, ఆయా అనుభూతి వాళ్ళకు వస్తుంది. ఆ వస్తువును నిజంగానే పొందుతారు. ఆ పొందటం అనేది వీళ్ళకే జరుగుతుందిగాని, ఇవ్వటమనేది అతడికి జరగదు. అక్కడ ఈశ్వరుడు క్రియాశూన్యుడేగాని, సమస్తక్రియలకు ఆధారభూతమైన కర్త, సాక్షిమాత్రుడు. అంటే, ఇదంతా జగత్కారణుడైన ఈశ్వరుడివల్లే జరిగినప్పటికీ; అతీతమైనస్థితిలో అతడు ఉండటంచేత ఇదంతా జీవులచరిత్రే తప్ప, ఈశ్వరుడు నిష్క్రియుడే అని చెప్పి ప్రతిపాదిస్తున్నది భాగవతం.

20. "భగవంతుడుకూడా ధర్మాలను రక్షించటానికే కదా వచ్చాడు! ఇట్లాంటి పనిచెయ్యవచ్చా?" అనేది సందేహం. అంటే అతడిలో ఒక వ్యక్తిత్వాన్ని చూడటంచేత పుట్టేసందేహం అది. అక్కడ కృష్ణుడనేటటువంటి ఒక వ్యక్తి – ఈ స్త్రీలతో సంచరించినట్లుగా ఆ ప్రకారంగా ఒక మనుష్యుడు అక్కడ లేడు. ఒకవేళ ఉన్నాడనే భావంఉంటే; మనుష్యమాత్రంగా అక్కడొకడున్నాడని, అతడు వీళ్ళను చేరదీస్తున్నాడని, వీళ్ళను రంజింప చేస్తున్నాడని, వీళ్ళను ఆలింగనాదులతో సంతోషపెడుతున్నాడనీ – ఈ భావాలన్నీకూడా కృష్ణపరమాత్మయందు అనువర్తించవు. ఒక పరిమితుడైన వ్యక్తి అంటూ లేడక్కడ.

21. ఇదంతాకూడా, జీవుడు ఏవేవి కోరుతున్నాడో, అది అక్కడ లభిస్తున్నది. అతడియొక్క నిష్క్రియత్వాన్ని తెలియచెప్పే ఒకేఒక వస్తువున్నది. ఆ వస్తువు నిష్క్రియమయినటువంటిది. సర్వకారణ కారణమే కాని; ఒక వ్యక్తి యొక్క ఒకానొక తత్కాలిక సంఘటనయందు ఒక సుఖాన్నికాని, దుఖఃన్నికాని ఇచ్చే వస్తువు కాదు అది. పాపం చేసినవాడు, పాపాన్ని పొందుతున్నాడు; పుణ్యంచేసినవాడు పుణ్యఫలాన్ని పొందుతున్నాడు అంటే; ఈతడు చేసిన కర్మ ఈతడే నిజానికి తిరిగి ఫలరూపంలో అనుభవిస్తున్నాడేకాని; 'పాపం చేసేవాళ్ళను ఆయన శిక్షిస్తున్నాడు, పుణ్యామూర్తులను అనుగ్రహిస్తున్నాడు' అనేటువంటిమాటను వాడుతున్నాం కాని; వాస్తవంగా ఆతడు ఎవరియందూ ఎలాంటిభావనతోనూ సంచరించడు.

22. భగవంతుడు నిష్క్రియుడు కాబట్టే, ఆయన పరమాత్మ, దివ్యాత్మ, సర్వాంతర్యామి. సర్వకారణకారణుడేకానీ, దేనికీ ప్రత్యక్షకారణంకాదు. కార్యంలేదు. క్రియలేదు. ఆతడియందు వ్యక్తిత్వమో,కర్తృత్వమో ఆరోపించిన వారు ఆయనను పొందలేరు. అతడిని అలా అర్థంచేసుకోలేరు. ఆయన అధర్మాన్ని చీల్చాడు కదా అని ఆయనయందు కర్తృత్వం ఆపాదించబడింది.మరి ఇదెందుకు

జరిగింది అంటే – మనయందు అధర్మభావన ఉండటంచేత, (ఇది ధర్మం, ఇది అధర్మం అనేటువంటి) ధర్మాధర్మవివక్షతలో, బంధనంలో ఉండటంచేత – ద్వంద్వస్థితిలో మనముండటంచేత, పరమాత్మకు కూడా ఈ ద్వంద్వస్థితిని ఆపాదించి; 'ఇది అధర్మము, దీనికిప్రతిగా ఈయన చేసింది ధర్మరక్షణ' అని మనం అంటూంటాము. అంటే కేవలం మనవంటి మరొక మానవమాత్రుడిగానే ఈశ్వరుడిని భావన చేసినప్పుడు, ఆతత్వాన్ని మనము పొందలేము అని ఆ బోధలోని సారాంశము.

23. భాగవతమతంలో, ఆయనను బాగాద్వేషించి క్రోధంతో ఆయనను చంపేస్తానని వెతుక్కున్నవాడు ఆతడిని విష్ణుమూర్తిగా చూస్తాడు. తనను చంపేసినట్లు భావన పొందుతాడు. వాడు చచ్చిపోతాడు. కంసుడు, ఆయన తనను చంపుతాడేమో అని భయభ్రాంతుడై ఉన్నాడు. వీడిని ఆయన ఇంకా ముట్టుకోనేలేదు. ఎదూరుగా ఉన్నాడు. "నా గొంతుపిసికి చంపేస్తున్నాడు. అయ్యో! చచ్చిపోతున్నాను" అని అరిచాడు. కృష్ణుడు అలా ఉన్నాడంతే! కంసుడు ఎలాభావించుకున్నాడో, తనను ఆయన ఎలావచ్చి చంపబోతున్నాడని అనుకున్నాడో ఆ భావనే యథార్థమయింది. అలాగే, తన భర్తగా వచ్చి తనను చుంబన ఆలింగనాదులతో గారవిస్తాడనే ఒక స్త్రీ యొక్క భావన, దానికదే సత్యమయిపోయింది.

24. ఇట్టి ఈశ్వరతత్త్వం అవగాహన చేసుకోవటం సులభం కాదు. గాథను గాథగా వింటూ ఉండాలి. తత్త్వాన్ని అవగాహనచేసుకునే ప్రయత్నం లోపల అంతఃకరణలో చేస్తూనే ఉండాలి.

25. శుకుడు అంటే వేదవ్యాసమహర్షియొక్క నోములపంట. శుకమహర్షి, దేహాత్మభావనలేని నిర్గుణమయిన నిరంజనస్థితిలో, అద్వైతస్థితిలో ఎల్లప్పుడూ ఉండేటటువంటివాడు. ఆ శుకుడు చెపుతున్నాడు: "ఈ ప్రపంచంలో అసత్యము అసత్యాన్నే పొందుతున్నది" అని దీని అర్థం. అంటే – జీవుడు అసత్యము, ఈతడు పొందేటటువంటి ఫలం అసత్యము. ఆ చుంబనాదులన్నీ కూడా ఆ జీవుడు ఊహించి కోరుకుని అనుభవించే స్థితికి తెచ్చుకుని, అనుభవిస్తున్నాడు. అసలు ఏమీ లేదక్కడ. అక్కడ ఉన్న కృష్ణుడు ఎప్పుడూ అలా అక్కడే ఉన్నాడు. కృష్ణపరమాత్మ మనుష్యరూపంలో అవతరించిన సమయంలోకూడా, ఆ పరమాత్మ తత్త్వం ఎలాగ ఉన్నదో అలాగే ఉన్నాడు అనే తాత్పర్యం. అతడి శరీరం అతడిని బాధించలేదు. ఆ శరీరానికి అతడు బాధ్యుడే కాలేదు. ఆయన

శరీరలక్షణములు వీళ్ళు ఊహించుకున్నవే! ఆయన సుందరంగా ఉన్నాడు, అందంగా ఉన్నాడు అనుకున్నారు వాళ్ళు.

26. ప్రరమాత్మవస్తువుకు నిష్క్రియత్వం ఉంటుందని ఎల్లప్పుడూ గుర్తుపెట్టుకోవాలి. ఆయన కర్తకాడు. పరమాత్మను అలాగే అర్థంచేసుకోవాలి. ఆ పరమాత్మయొక్క అనుగ్రహం అంటే ఏమిటి? చిన్నపిల్లలను జాగ్రత్తగా ఎత్తుకోవటంలాంటిది. లోపల ఆత్మవస్తువు ఉండనే ఉన్నది. దానిని వెతుక్కునేపని లేదు. చిత్తమనేటటువంటిది లోపల ఉండేటటువంటి ఆత్మను, కృష్ణరూపంలో అన్వేషించి పొందవచ్చు భక్తిభావంతో.

27. ఈ చిత్తము, ఈ భ్రాంతి అంతా కూడా, గోపికలు పొందే సుఖ దుఖాఃలు, ఏడవటం-ఆనందము అంతా కూడా చిత్తమే. ఆ చిత్తం-లోపల ఉండేటటువంటి ఆత్మవస్తువుకు, పరమాత్మవస్తువుకు దగ్గరగా ఉన్నటువంటిదే! చిత్తానికి ఆత్మకంటే సమీపమయిన మరొకపదార్థంలేదు. చిత్తము ఆ పరమాత్మను పొందేటప్పుడు – భక్తిభావంతో ఒకరు పొందారు, భావంతో మరొకరు పొందారు.

28. ‘బాలోన్మత్త పిశాచవత్ ‘ అంటారు. చిన్నపిల్లవలె, ఆ అనుభూతి కలిగిన తరువాత-ఈ ప్రపంచస్పృహ పోవటమనే స్థితి – మైకము మనందరికీకూడా సాధ్యమే! ఎందుకంటే ఏ భావనతో ఏది కావాలని ఆయనను అడుగుతారో, అటువంటి భావనను వాళ్ళుపొందుతారని చెపుతుంది భాగవతము.

29. ఆయన క్రియాశూన్యుడు, సర్వకారణకారణుడేకాని, ఆయన ప్రత్యేకంగా దేనికీ కారణముకాదు. కారణాలకుకారణం వంటివాడు. పాపానికి, పుణ్యానికి సహజంగా ఏ సృష్టిలో ఫలాన్ని ఇచ్చేటటువంటి శక్తి ఏదో అదేఇస్తుంది తప్ప; ఏ వ్యక్తినీ ప్రత్యేకంగా, “నువ్వు పాపం చేసావు కాబట్టి నిన్ను శిక్షిస్తున్నాను” అని ఆయన అనలేదు. అకర్తృత్వభావనతో అతడు సమిష్టిగా ఉంటాడు కానీ, వ్యక్తిగా ఆతడు ఏపనీ చెయ్యడు. ఒకే వస్తువుగా ఉంటాడు.

30. కాబట్టి వాళ్ళవాళ్ళ రాసక్రీడలలో అనేకమంది గోపికలతో అనేకమంది కృష్ణులు ఏకకాలంలో కనబడటంచేత వాళ్ళ అంతఃకరణంలో వాళ్ళ తపోబలం(తపన) చేతనే అది సాధ్యమయింది. అంతర్యామి ఆయనను-ఆత్మలో కృష్ణుడిని-ధరించి, అలాగే వెర్రిగా తిరిగారు. ఆడుకున్నారు. పాడుకున్నారు. అతడు కౌగిలించుకున్నాడు అని అనుకున్నారు వాళ్ళు. అట్టి స్థితిని మోక్ష హేతువుగా చెపుతుంది భాగవతం. అది పిచ్చి స్థితి అనుకుంటారేమో, కాదు మోక్ష హేతువని చెబుతుంది.

31. వాళ్ళూ ఈశ్వరుణ్ణి-ఆ కృష్ణపరమాత్మని- ధ్యానంలో పెట్టుకొని ఆ పనిచెయ్యటంచేత, ఆ ధ్యాస వాళ్ళకు ముక్తిహేతువు అవుతుంది. అతడి యందు తమ మనుష్యత్వం నశించటమే జరుగుతుంది! ఆత్మ ఒక్కటే మిగులుతుంది. ఆ తరువాత వాళ్ళ తపస్సు ఫలించింది. ఆయన వాళ్ళ తపస్సుకు ఫలం ఇచ్చిన తరువాతనే నందవ్రజంనుంచి వెళ్ళిపోయాడు. ఆయన వాళ్ళకు ఆ ఫలం ఇవ్వకపోతే, వాళ్ళు ఒకవేళ ఆ ఫలం పొందకపోతే, అది ఈశ్వరుడియొక్క తత్త్వలక్షణానికి కళంకం అవుతుంది. తపన పడిన తరువాత, అంత ఏడ్చిన తరువాత, వాళ్ళకు ఫలంలభించకుండా ఆతడు వెళ్ళిపోతే, ఏమైనట్లు? మనకెందుకు ఇలాంటిఈశ్వరుడు! ఎందుచేతనంటే, ఆయన అవతార కార్యక్రమం బయట చాలా ఉంది. వీళ్ళకు తొందరగా ఫలం లభించింది. ఆయనకు బయట ఏపనీ లేకపోతే, 125 సంవత్సరాలూ ఇక్కడే ఉండేవాడు. వాళ్ళు తపస్సులో ఇంకా అలాగే ఉండేవాళ్ళు అసంపూర్ణంగా. వీళ్ళకది ఇచ్చేసి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. ఇది ఈశ్వర తత్త్వంగా భావన చెయ్యాలి. అదీ భాగవతమతం. కపిలుని యొక్క సాంఖ్యం! రెండింటికీ సమన్వయం. మార్గములు అనేకం. గమ్యస్థానం ఒక్కటే! ఒకే చోటికి చేరుతాయి ఈ దారులన్నీ.

32. ఈ సైన్సు అనేది అసలు ఎక్కడినుంచి వచ్చింది? ఈ బుద్ధి వారికెక్కడి నుంచి వచ్చింది? విమర్శనాజ్ఞానం ఎక్కడినుంచి వచ్చింది? అనేటువంటి ప్రశ్న పుట్టడంలేదు. తన బుద్ధి కుశలతతో నిర్మాణం చేసుకున్నటువంటి మూర్ఖత్వం ప్రస్తుతం ఈ లోకానికి ఉన్నది. వీళ్ళకు ప్రమాణబుద్ధి, వీళ్ళే స్వయంగా నిర్మించుకున్నటువంటి సైన్సు మీదనే, విజ్ఞానశాస్త్రం మీదనే ఉంది తప్ప; జ్ఞానం మీదలేదు. ప్రామాణబుద్ధి దేనియందుందో, తదనుగుణమైన మార్గాన్ని మనయందు దయతో చూపించటానికి ఆయన ఎప్పుడూ వస్తూ ఉంటాడని తాత్పర్యం. ఈశ్వరుడియొక్క అవతారానికి అదే కారణం.

33. దర్శనములు అనేవి రండు విధములుగా ఉన్నవి. ఆర్షదర్శన్ములు, అంటే వేదము ప్రమాణంగా తీసుకున్నవి. వేదము ప్రమాణ్మ్ము కాదు అనే దర్శనములు నాస్తికదర్శనములు. ఆ దర్శనకర్తలు, ఈ దర్శనకర్తలు ఇద్దరూ కూడా జీవిడియొక్క మోక్షమార్గాన్ని గురించి అన్విషించి చెప్పినవాళ్ళయి ఉండవచ్చు. అయినా వాళ్ళ ధ్యేయము ముక్తి అయినప్పటికీ; వేదప్రామాణ్యతను దృష్టిలో పెట్టుకొని చెప్పేమార్గోపదేశము చేసినటువంటి దర్శనములు ఏవయితే ఉన్నవో అవి ఆర్షదర్శనములు అనబడతాయి.

34. 'దేహము పొందేటటువంటి సుఖదుఖాఃలు, దేహి అయినటువంటి ఆ లోపల ఉండేటువంటి ఆత్మకు చెందవు. అది ఏరకమైన సుఖాలనూ, దుఖాఃలనూ అనుభవంచదు. 'నశ్వరమై కొంతకాలం ఉండి కొంతకాలానికి వెళ్ళిపోయేటటువంటి శరీరానికి వచ్చేటటువంటి సుఖదుఖఃములు కూడా నశ్వరములే! అసత్యములే!' – అనేటువంటి విమర్శజ్ఞానంతో దీనిని బాగా తెలుసుకుని, దృఢమయిన జ్ఞానంతో ఒక్కమాటే ఆ విషయసుఖములను వదిలిపెట్టాలి.

35. "మొట్టమొదట పంచేంద్రియములను సమీకరించుకుని, వాటన్నిటినీ నియంతృత్వంలోనికి తీసుకొని; విషయములను, ఇంద్రియములను విశ్చయముగా శాసించగలిగిన శాసనకర్తవు నీవే అయి, అవి నిన్ను శసించకుండా చేసుకున్నతరువాత – అంతటి దృఢమైన జ్ఞానము వచ్చినతరువాత; ఇంద్రియములను, వాటి సుఖదుఖములను వదిలిపెట్టాలి". అని బోధ. మొట్టమొదట యోగానికి ఇది ప్రవేశప్రాంగణము. లోపలికి వెళ్ళిన తరువాత యోగంలో ప్రవేశిస్తారు.

36. సుఖము-దుఖఃము, ఉదయము-అస్తమయమువలె ఉంటాయి. అలా ఒకనాడు కాలగతిలో సుఖం వస్తుంది. అన్నీ కూడా గదిచిపోయేవే, నిలబడి ఉండిపోయేవి కావు అని తెలుసుకోవాలి. సుఖము శాశ్వతం కాదు, దుఖఃము శాశ్వతం కాదు. సూర్యోదయం, సూర్యాస్తమయం శాశ్వతమా? రాత్రి శాశ్వతంగా ఉందా! ఏమీలేదు. గడచిపోతోంది. ఆ ప్రకారంగానే, క్షణికంగా ఉంది ఆయువు. ఆయువు క్షణికం అంటే-125 ఏళ్ళు ఆయుర్దాయం ఉండి కూడా క్షణికమేనా అంటే – మన జీవనం అనేటువంటి క్రియ క్షణక్షణంగా ఉంది. మనం ఎప్పుడూ కూడా ఒక్కక్షణమే జీవిస్తున్నాము. ఆ క్షణం అయిపోయిన తరువాతనే ఇంకొక ఉత్తరక్షణంలో జీవిస్తున్నాము. ఆ తరువాత మరొక క్షణంలోకి ప్రవేశించి ఆ క్షణాన జీవిస్తున్నాము. అంటే జీవనం క్షణికమే అవుతోంది.

37. అట్లాంటి జీవనక్రియలో ఉన్నప్పుడు, ఒకప్పుడు ఆకలితో బాధ పదుతున్నాం, ఒకప్పుడేమో ఆకలి తీర్చుకోవటానికి అన్నంతిని తృప్తిపడుతున్నాం. మరొకప్పుడు ఇంకేదో పని చేస్తున్నాం. ప్రతీ ఒక్క అనుభవంలో కూడా క్షణికంగా-క్షణక్షణాలలో జీవిస్తున్నామే తప్ప, ఒక continuity గా, ఒకే కాలమనేటటువంటి వస్తువుగా మనంకాలాన్ని అనుభవించటంలేదు. ఎందుచేతనంటే, ఏ అవస్థాకూకూడా

నిత్యత్వం లేదు. ప్రతీ అవస్థా క్షణికమే కావటంచేత, అయుర్దాయం క్షణికము అని చెప్పబడుతున్నది.

38. ఆయుర్దాయం క్షణికం అంటే, మామూలుగా ఏముంది! ఎవరైనా, ఇంకో 20 ఏళ్ళు బతుకుతాను, అది క్షణికం ఎలా అవుతుంది అనవచ్చు! ఇరవై ఏళ్ళూ అంటే చాలా కాలమే కదా! అనుకోవచ్చు. ఆయుర్దాయం క్షణికమంటే ఏమిటి? ఎప్పుడు ఏపని చేస్తాడో ఆ క్షణంలో ఆ పనిచెయ్యటమే! వండుకున్నాము. పొద్దున్నేలేచాము. కాలకృత్యాలు తీర్చుకున్నాము.ముఖం కడుక్కున్నాము. స్నానంచేసాము, పూజచేసుకున్నాము, భోజనం చేసాము. ఎక్కడికో వెళ్ళాము. తిరిగి వచ్చిపడుకున్నాం. అయిపోయింది. ఇప్పుడు మళ్ళీ అదే స్థితిలో ఉన్నాము. రేపు పొద్దున మళ్ళీ అలాగే ఉంటాము. ఇది క్షణికంకాదా!ఏదయినా ఒక్క అనుభవం, ఒకస్థాయి, ఒక స్థితిని స్థాయీభావంతో ఖచ్చితంగా అనుభవితున్నామా? స్థితి అంటూ ఉందా మనకు? స్థితిలో లేనటువంటి, క్షణక్షణమ్మా అనుభవించేటటువంటి ఆయుర్దాయం మొత్తము అంతా క్షణికమే అని అర్థంచేసుకోవాలి!

39. అసలు అనుభవించేటటువంటి ఈ క్షణాలు అన్నిటినీకలిపి, కాలాన్ని అనుభవిస్తున్నామని అనుకుంటున్నాం! ఎవరూ కాలాన్ని అనుభవించటం లేదు. కాలవస్తువుని ఆ ఈశ్వరుడు ఒక్కడే అనుభవిస్తున్నాడు. ఎందుచేతనంటే ఆయనకు క్షణికంలేదు. ఆయన నిత్యుడు, శాశ్వతుడు, నిరంజనుడు. కాలం అంతా ఆయనలో లయం అయి పోతున్నది కూడా. జగత్తు అంతాకూడా ఆయనలో లయం చెందుతున్నది. మహాకాలుడాయన. కాలస్వరూపుడు, సాక్షిగా ఉన్నాడు.

40. మానవజన్మకు సంబంధించిన అనుభవములు సర్వమునకు సాక్షిగా ఉండి, ఏదీ అనుభవించని ఆ కాలమే ఆయన.

41. మానవజన్మకు సంబంధించిన అనుభవములు సర్వమునకు సాక్షిగా ఉండి, ఏదీ అనుభవించని ఆ కాలమే కృష్ణపరమాత్మ. కర్మయొక్క తత్వం ఏమిటో తెలుసుకోవాలి. వేదం చెప్పిన కర్మలు ఏవో అవి తెలుసుకొని వాటిని చెయ్యాలి. వేదోచిత కర్మలను ఆచరించాలి. వీటియందుప్రమాణబుద్ధితో ఉండాలి. నేను ఎందుకు చెయ్యాలి అనేప్రశ్న ఉండకూడదు. వేదము నన్ను తృప్తిపరిస్తే నేను చేస్తాను అని అనుకోకూడదు. ఎందుకంటే, మనకు తననుతాను

ఋజువుచేసుకోవలసిన పని వేదానికి లేదు. వేదోచితకర్మలను మన చేస్తే మన్ జీవితాలు ఒకదారిలో పడతాయి, లేకపోతే లేదు.

42. ప్రపంచాన్ని గురించిన సందేహనివారణకోసమే ఈ కపిల సాంఖ్యం పుట్టింది. ప్రపంచాన్ని అర్థం చేసుకోవటం ఎలాగ? నాజీవనవిధానం ఎలా ఉండాలి? అనేటటువంటి ప్రశ్నకు సాంఖ్యం జవాబు చెబుతుంది.

43. ముక్తికోరుకోవటమే మనకు శరణ్యమని, పరమాత్మను మనకు దానినే ప్రసాదించమని కోరుకోవాలి. అదే మనకు ధ్యేయంగా భావించాలి. ఈ విశ్లేషణవలన మనలో పరివర్తన కలిగినప్పుడు ఆత్మవస్తువు సహజంగానే దర్శనమిస్తుంది. దానిని పొందటానికి ప్రత్యేకంగా చేయాల్సిన కర్మంటూ ఏమీలేదు. అందుకనే సత్వరజస్తమోగుణములు కర్మలలో లేవు; బుద్ధిలో ఉన్నవి. బుద్ధిలో ఉండే సత్వగుణం కాసేపు భజన చేయిస్తుంది. రజోగుణం ఎవరినయినా తన్నమని-తిట్టమని అంటుంది. తమోగుణం కడుపునిండా భోజనం చేయమంటుంది. కర్మలలో ఏమీ లేవు. ఒక సాత్వికకర్మ, మరొక రాజకర్మ ఉన్నవి. కర్మయొక్క హేతువులు, కర్త అయినటువంటి బుద్ధిలో ఏదయితే ప్రేరకశక్తి ఉన్నదో, దానియందున్నాయి. గుణత్రయాతీతంగా ఈ బుద్ధిని మార్చుకోవాలంటే ఏం చేయాలి? గుణత్రయాతీత మయినటువంటి వస్తువు ఉంటే, దాని యందు ఈ బుద్ధిని ప్రవేశపెట్టగలగాలి. ఈ కర్మలన్నీకూడా-వేదంచదువుకొన్నా, యజ్ఞం చేసినా, కసాయి వాడి ఉద్యోగం చేసినా-ఆయా గుణములు బుద్ధిలో ప్రవేశించి చేయించే పనులే తప్ప, కర్మకు ఒక్ గుణం లేదు అని అర్థం చేసుకోవాలి. ఇది కపిలుని ఉద్దేశ్యం.

44. పంచభూతములలో, భూతతత్వములో పంచేంద్రియములు ఉన్నాయి. ఆకాశంలో అగ్ని ఉంది. అగ్నిలో జలమున్నది. జలములో భూమి ఉంది. కౌశికునిలో బలమెలా ఉందో, ఉపేంద్రునియందు క్రాంతి ఎలా ఉందో, ధనంలో లోభత్వం ఎలాఉందో-తమస్సులో ముద్ధి, రజస్సులో తమస్సు, సత్వంలో రజస్సు ఉన్నామని చెప్పాడు ఆయన. జాగ్రత్తగా అలోచిస్తే అంతా సత్వమే? అది అర్థంకావాలి అంతే.

45. అర్థంలో లోభం అన్నారు. ధనానికి ఉన్నగుణం ఏమిటంటే, అది ఎవరినీ వరించదు. ఉదాహరణకు రోడ్డుమీద ఒక వెయ్యిరూపాయలనోటు అక్కడపడి ఉంటే, వచ్చి నన్నెవరయినా తీసుకోండీ అని ఆ ధనం పిలుస్తుందా? పిలవదు. వెంటనే చూచేవాళ్ళలో లోభత్వాన్ని కలుగచేస్తుంది. అది ధనంయొక్క లక్షణం

అని అంటాం. కానీ బుద్ధిలోపుట్టే వికారమే అది. ధనంలో లోభం ఉంది. అంటే ధనాన్ని చూస్తే మనిషిలో లోభత్వం కలుగుతుంది. బుద్ధి అక్కడ కర్త, వస్తువుగా ఉంది. ఏదయినా అంతే! ఒక వస్తువులో ఇంకొక వస్తువు ఇమిడి ఉన్నది.

46. మనసు ఒక స్తంభాన్ని చూడగానే అది స్తంభము అని గుర్తుపట్టటం; దాన్ని బుద్ధి అంటారు. చూడటము అనేటటువంటిది, చూపు ఇంద్రియం చేసినప్పటికీ, మనసు అనేది మొట్టమొదట దానియందు ప్రసరిస్తుంది. పూర్వజ్ఞానంచేత-అంతకుముందు ఉండే అనుభవంచేత-ఇలా పొడుగ్గా, నిలువుగా ఉండేటువంటిది స్తంభము అనేటువంటి జ్ఞానము బుద్ధిది. మనస్సు, ఇంద్రియాన్ని అనుసరించి అక్కడిదాకా తీసుకువెళుతుంది. నేత్రేంద్రియం అక్కడిదాకా మనస్సును అనుసరించి వెళితేనే అది బుద్ధికి స్తంభంగా గోచరిస్తుంది తప్ప; మనసుకాని, నేత్రేంద్రియంకాని అది స్తంభమని తమంతటతాము గుర్తించలేవు.

47. మనస్సనేది అన్ని ఇంద్రియముల వ్యాపారాన్ని చేయించేటటువంటి ఒక శక్తి. విశ్లేషణ చేసి పూర్వానుభంతో ఇది ఇదమిద్ధం అనితేల్చేది బుద్ధి. విశ్లేషణ, విచక్షణ దానికుంటుంది. ఈ విశ్లేషణ నిరంతరమూ ఎలా ఉంటుందంటే, ఒక లాగే ఉండదు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లనేటువంటి లక్షణములను ప్రేరణచేస్తుంది బుద్ధి. బుద్ధికి ఒక వస్తువును చూస్తే భయము కలుగుతుంది. ఇట్లాంటి లక్షణములన్నీ కూడా రజోగుణ లక్షణములు. డైనమిక్ రియాక్షన్, అంటే రజస్సు రియాక్షన్లో డైనమిజంగా ఉంది. అనుగ్రహమో, క్రోధమో ఏదో వస్తుంది. అది రజోగుణం. బుద్ధి ద్వారా పనిచేస్తుంది.

48. రజస్సులో కొన్ని సందర్భాలలో తమస్సు ఉంటుంది. తమస్సు అంటే అంధకారం, సత్యానికి, సత్యదూరత్వం.అంటే సత్యానికి చాలా దూరం వెళ్ళిపోవటము, అసత్యపదార్థాన్ని సత్పదార్ధంవలే భావించటము-ఇవన్నీ తమోగుణ లక్షణములు. తమస్సు అంటే ఇంకా చాలా చెప్పవచ్చు. నిద్రావస్థ ఉన్నది. దాన్ని తమస్సు అంటాం. ఉదాహరణకు విచక్షణ లేకుండా కళ్ళు మూసుకొని నడిస్తే కిందపడతాడు, పళ్ళువిరుగుతాయి. పళ్ళు ఎలా విరుగుతాయో చుద్దామని అనుకుంటే అది తమస్సు. ఈ విషయాన్ని తనే స్వయంగా తెలుసుకుందామనుకొని కళ్ళుమూసుకొని నడిస్తే, వాడు బుద్ధిహీనుడు. విచక్షణ ఒక క్రియయందు ప్రవేశించటం, స్వప్రయోజనం లేకుండాకూడా ప్రవేశించటము తమస్సు. అజ్ఞానం. నిష్ప్రయోజకమయిన క్రియయందు అంతఃకరణ ప్రవేశించటము. నిష్ప్రయోజకము అంటే ఏమిటి? ఉదాహరణకు, నిద్ర ఉంది.

దానియొక్క ప్రయోజనం ఏమిటి? దానివలన శరీరానికి ప్రయోజనం కలుగుతుంది. అయితే కర్తకేమిటి ప్రయోజనం? శరీరానికి ప్రయోజనం అయిన నిద్రలో, తన ప్రయోజనం ఆశించి కర్త ప్రవేశిస్తే, అది నిష్ప్రయోజకం. తన ప్రయోజనం ఆశించి, నిష్ప్రయోజకమయినటువంటి ఒక పనిలో కర్త ప్రవేశించటం పేరు తమస్సు.

49. బుద్ధిలో రజోగుణం ఉంది కనుకే, ఈ ప్రపంచం అంతా తెలుసుకుని జగ్రత్తగా నడుస్తాం. అలా తెలుసుకోకపోతే; రోడ్డుమీద నడుస్తున్నాం లారీవస్తూంటుంది, జగ్రత్తగా ఉండకపోతే దానికింద పడతాం. అది ప్రమాదమని ముందే తెలుసుకొని కన్నేమో లారీని చూపించింది. బుద్ధేమో అది మీదకి వస్తుంది అని చెపుతుంది. కాబట్టి ఇంద్రియములు అక్కడినుంచీ తప్పుకో అని పక్కకు నెడుతున్నాయి. అంటేదేహరక్షణోపాయానికి ఈ రజోగుణబుద్ధి కారణమవుతున్నది. దేహపోషణకుకూడా అదేకారణమవుతున్నది. ఆకలివేస్తే, అన్నం ఎక్కడదొరుకుతుందో వెతుక్కుని తింటాం. ఇదంతా బుద్ధియొక్క లక్షణం. ఇదంతా రజోగుణమే.

50. 'సత్వరజస్సేమిటి?' అంటే, అంతఃకరణ సాత్వికస్థితిని పొందినపుడు, ఉపశమనంకావాలనేది. ఈ ప్రపంచంలో ఉండేటటువంటి ద్వంద్వములనుంచీ వచ్చేటటువంటి దుఖాఃన్ని తప్పించుకుని శాంతిని పొందాలనే కోరిక పుడితే, అది సత్వగుణ లక్షణము. అది కూడా ఈ బుద్ధిలో రజోగుణంవల్లనే వివేకంచేత పుట్టింది. ఇది రజోగుణసముద్భవమయిన వివేకం. ఇది లేకొపోతే వివేకము పుట్టదు; సద్వస్తువునందు మనసు ప్రేరణ పొందదు.

51. ఈశ్వరుడిని పొందాలి, ఇదంతా వినాలి, జ్ఞానము, మోక్షము కావాలనేటటువంటి కోరిక-సత్వగుణం! దానికోసం చేసేప్రయత్నం అంతా రజస్సు. పెద్దలను కూర్చోబెట్టాలి. భాగవతం చెప్పండి అని వారిని అడగాలి. శ్రద్ధతో వినాలి. విన్నదానిని మనసు, బుద్ధితో విశ్లేషించాలి. సందేహంవస్తే మళ్ళీ అడగాలి. ఈ క్రియాకలాపం అంతా రజస్సే. సత్వమందుకూడా రజస్సే పనిచేస్తుంది. సత్వగుణం ఉండీ రజోగుణం లేకపోతే మనిషి అక్కడే పడి ఉంటాడు. నిష్క్రియుడవుతాడు. సత్వగుణం మాత్రమే కలిగి ఉండి రజస్సు, తమస్సు రెండూ లేనివాడు కాబట్టి ఈశ్వరుడు సత్ పదార్థంగా గ్రహించబడుతున్నాడు. అతడికి క్రియా రూపంలేదు. పొందతగిన వస్తువు, పొందవలసిన వస్తువు, సుఖదుఖఃములనే ద్వంద్వములు, ఇది ఒదిలిపెట్టి అది తీసుకొనేటటువంటి ఆవశ్యకత, రెండూ లేవు. ఈశ్వరుడిముందర రెండూలేవు.

52. అందువలన ఈశ్వరుడికి మనస్సు, బుద్ధి, చిత్తము లేవు. త్రిగుణాలూలేవు. అది శుద్ధసత్వమనేటటువంటిది. అయితే ఈ సత్వరజస్తమస్సులనే మూడుగుణములలో ఒకటయిన సత్వము కాదు. మూడుగుణములకూ అతీతమయిన సత్వము. మనలో ఉన్న సత్వగుణము దుఖోఃపశమనాన్ని, శాంతిని కోరేటటువంటి తాత్కాలికమయిన సత్వలక్షణమే తప్ప; శాశ్వతంగా పొంద గలిగినటువంటి ఆత్మవస్తువు, ఆత్మదర్శనహేతువు అది కాదు. ప్రయత్నానికి సత్వగుణం కారణమవుతున్నది.ఈ ప్రపంచంనుంచి వెళ్ళిపోయే ప్రయత్నంచేసినప్పుడే ఆ సత్వం కారణంవుతుంది తప్ప, ఈశ్వరునియొక్క సత్వము శుద్ధసత్వము.

53. వైకుంఠం శుద్ధసత్వంచేత నిర్మాణంచేయబడింది అని శాస్త్రం చెబుతుంది.శుద్ధసత్వం అంటే అక్కడఏమున్నది? ఎవరయితే ఆయనను(విష్ణువును) ఆ సగుణస్వరూపముగా ధ్యానం చేసి, తపస్సుచేసి శరీరాన్ని వదిలిపెట్టి వెళతాడో, ఆ జీవుడికి అక్కడికి వెళ్ళగానే సర్వమూ విష్ణుమయంగా, శుద్ధసత్వగుణస్వరూపంగా అనుభవం అవుతుంది. అక్కడ విష్ణువుతప్ప రెండోదేమీలేదు. ఆ లోకస్థుడవగానే అతడికి సామీప్యము, సాలోక్యము, సారూప్యము, సాయుజ్యము ఇవన్నీ(విడివిడిగానే చెప్తాము కానీ) ఒక్కమాటేవస్తాయి. విష్ణుతత్వానికి సమీపవర్తి అయిన తరువాత, విష్ణురూపం వచ్చిన తరువాత, విష్ణుమయం అయిన తరువాత, విష్ణువేకాకుండా రెండో వస్తువుగా ఉండగలిగిన శక్తి ఏ జీవుడికీ లేదక్కడ. బ్రహ్మకూ లేదు. రుద్రుడికీ లేదు. రుద్రుడుకూడా అక్కడకు వెళ్ళగానే విష్ణుస్వరూపుడవుతాడు. బ్రహ్మదేవుడయినా అక్కడికి వెళ్ళగానే విష్ణుస్వరూపుడవుతాడు. విష్ణుమయమే అవుతాడు, కానీ 'నేను ఫలానా, ఈ విష్ణులోకానికి వచ్చాను' అనేభావన అక్కడ ఉండదు. అందువల్ల శుద్ధతత్వం అది.

54. మనలో ఉండే సత్వగుణం-ఇది దుఖఃము, ఇది సుఖము అనే విచక్షణచేసి, దుఖాఃన్ని దూరంగా పెట్టుకొని శాంతిని పొందేటటువంటి కోరికతో ఉండేటటువంటిది. మనలో ఉండే రజస్సు, తమస్సుల ముందర ఉండే సత్వం ఇది. అలాంటి సత్వగుణం-ముందుగా రజస్సు పనిచేస్తేనే, ఒక క్రియాకలాపం ఒక సాధన ప్రారంభిస్తుంది. అంతఃకరణలో, సత్వగుణ ప్రధానమయిన చిత్తమందు, ఈ ప్రపంచాన్ని వదిలేస్థితి వస్తుంది. ఇక అది మళ్ళీవెనక్కు తిరిగిరాకుండా ప్రపంచం వదిలినప్పుడు; అప్పుడు ఈతడిలో ఉండే సత్వము ప్రపంచహీనమవుతుంది,

ప్రపంచానికి దూరమవుతుంది. అందుచేత రజస్తమస్సులకు శాశ్వతంగా మరుపు కలుగుతుంది. ప్రతిజీవుడియందుకూడా తన అంతఃకరణలో ఉండే సత్వమందే – సత్వగుణమందే – ఆత్మదర్శనమవుతుంది.

55. కాలాంతరమందు ఈ త్రిగుణములలో ఒకటేగుణం మిగిలిన రోజున, ఆ మిగిలినవన్నీకూడా నశించిన తరువాత, స్త్వగుణమనేటటువంటిది ఏదయితే లోపలున్నదో, దానియందు ఆత్మదర్శనమవుతుంది. ఆ ఆత్మయే నారాయణుడు. ఆ ఆత్మయే రుద్రుడు, ఆ ఆత్మయే ఇంద్రుడు, ఆ ఆత్మయే పరమశివుడు-అలా అని సాంఖ్యం త్రిమూర్తులనూకూడా ఆత్మలో నిరూపణం చేసింది. అప్పుడు ఈతని – దేహాభిమానము, దేహాత్మభావన ఇవన్నీ గడిచి పోయిన తరువాత-సత్వం ఆత్మగుణమునందు వదిలిన తరువాత, ఆత్మ పరమునకు చేరుతుంది. పరమునకు చేరటమంటే ప్రపంచము, సృష్టి వీటికి అతీతమయినటువంటి, ఇది కానటువంటి వస్తువు ఏదయితే ఉన్నదో అది. ప్రపంచము, సృష్టి, ద్వంద్వము అనేకత్వము ఇవన్నీ కానటువంటి పరమసత్వమేదయితే ఉన్నదో, ఈ ఆత్మ-ఈ సత్వగుణంలో పుట్టిన ఆత్మవస్తువు-ఆ పరమునకు తగిలి ఉంది; దానితో సంబంధం కలిగి ఉన్నది. ఆ పరమునకు తీసుకెళుతుంది. ఎక్కడ సృష్టిలేదో అక్కడికి తీసుకెళుతుంది. ఆ పరమే మోక్షము. అదే ముక్తి. ఈ ప్రకారంగా మోక్షానికి ఇంకొక పర్యవసానం లేదు, అదే చిట్టచివరిది అని ప్రతిపాదించాడు కపిలుడు.

56. ఈ లోకంలో ఇక్కడ అన్నీ నశ్వరమే. కాబట్టి ఈ స్త్వగుణమందు మళ్ళీ రజస్సు ఉంటుంది. ప్రపంచంలో ఉండేటటువంటి విషయవాసనల నుంచీ వైముఖ్యం ప్రధానలక్షణంగా కలిగినటువంటిది సత్వగుణం. దాంట్లో రజోగుణం చేరినప్పుడు ఏ పనిచేస్తుందో, ఆ ధ్యేయంతో అదంతాకూడా ముక్తిహేతువుగానే భావించమని కపిలుని అర్థం. సత్వమందు రజస్సు సృష్టినుంచీ వైముఖ్యానికీ తీసుకురావచ్చు; లేకపోతే స్వర్గానికివెళ్ళి ఇంద్రపదవిని అధిష్ఠిస్తే ఎలా ఉంటుందో అనేభావనకూడా కలుగవచ్చు. శాశ్వతమయిన సుఖం ఆపేక్షించకపోవచ్చు. రెండూ సత్వమందున్న రజస్సే అని అర్థం చేసుకోవాలి. కాబట్టి విచారణచేత, గురువుయొక్క బోధచేత, తనలో ఉండేటటువంటి ఒక శక్తిచేత-ఏది ధ్యేయంగా నిర్ణయించుకొని ఎటువెళ్ళాలో గురుముఖతః తెలుసుకొని అటువెళ్ళాల్సిందే తప్ప-అదే మోక్షవిద్య తప్ప, మరొక మార్గమే లేదు. అక్కడి మార్గం ఈ రజస్సు ఎటు పనిచెయ్యాలో, ఏ

క్రియాకలాపంలో ప్రవేశించాలో, దానిని గురువు నిర్ణయిస్తాడు. అందుకని సాంఖ్యం యోగాన్ని ఆశ్రయించింది.

57. రెండు రెక్కలూ లేనిదే పక్షి పైకెగురలేదు. రెండురెక్కలూ సమానమైన కొలతలో ఉండాలి. అదొక షరతు. లేకపోతే ఎగురుతుందా! కాబట్టి సత్త్వమందు రజస్సు మనిషిలో ఎప్పుడు ప్రవేశించిందో, అప్పుడు అతడు యోగంలో ప్రవేశించవలసి వస్తుంది ఆత్మదర్శనంకొరకు. అక్కడ సాంఖ్య, యోగములు రెండూ బోధచేస్తున్నారు. సాంఖ్యంచెపితే యోగంచెప్పవలసిందే! కేవలం సాంఖ్యమొక దానివల్లనే ముక్తిమార్గం లభించదనే విషయం యోగంలో రూఢీ అయింది.

58. సాంఖ్యంలో ఈశ్వరప్రతిపాదన లేదు అనేటటువంటి ఒక విషయం రూఢీగా అందరిచేత నమ్మబడుతోంది కాబట్టి, యోగమందు ఈశ్వరప్రతిపాదన చెయ్యబడింది. ఏది ఇందులో-సాఖ్యంలో-చెప్పబడలేదో. అది యోగమందు చెప్పబడటంచేత; సాంఖ్యయోగములు పరస్పరము పుష్ఠికరములై, సంపూర్ణత్వం పొందుతాయి. యోగశాస్త్రంతో కలిసి ఉండటంచేత సాంఖ్యానికి పర్యవసానం అంటూ ఏర్పడింది. ఒకటి సిద్ధాంతము, ఇంకొకటి క్రియ. అలా భావించవచ్చు. యోగంలేని సాఖ్యంలేదు. సాంఖ్యంలేని యోగంలేదు. కాని ఆ రెండూ ఎప్పుడైనా పనిచేయదల్చుకుంటే రెండింటినీ చదువుకొని ఒక్కమాటు మొదలుపెట్టవలసిందే తప్ప, ఏపుస్తకమూ ఒక్కటే మార్గదర్శకం కాదు. సిద్ధాంతం ఉంటుంది. ఒక సూత్రం ఉంటుంది. తరువాత సాంకేతిక పరిజ్ఞానం ఉంటుంది. ఇన్నిలేవా? చివరకు మనకు లాభం రావాలంటే theory, practice, సహాయకరంగా ఉంటాయి. theory ముందర సాంఖ్యంగాను, practice యోగంగాను ఉంటాయి.

59. యోగమందు ఈశ్వరప్రతిపాదన ఉంది. ఈశ్వరుడు ఏ రూపంలోనైనా, యోగంలోనైనా ఉండవచ్చు. ప్రరమాత్మ, జీవాత్మ లేదా పరాశక్తి, పరమపురుషుడు-ప్రకృతి; ఏ పేరయినా పెట్టుకోవచ్చు. రెండే ఉన్నాయి. ఈ రెండూకూడా లయక్రియను ఎక్కడైతే సాధిస్తాయో-సహస్రార కమలంలో రెండు లేకుడా ఒకటవుతుందో-సుషుమ్నద్వారా ప్రవేశించి రెండూ ఒకటయి కలుస్తాయో అక్కడికి వెళ్ళిన తరువాత పర్యవసానం ఏదీ ఉండదు. ఈభృకుటి దాటిన తరువాత అక్కడ సహస్రారకమలంలో రెండూ ఉండవు. ఒకటే మిగులుతుంది. అదే ముక్తి.

60. ఈ సృష్టియొక్క సుఖదూఃఖాలకు అతీతంగా ఒకానొక అతీతస్థితిలో ఉండటము అంటే-ఇంకా తానుంటాడు. అక్కడ సహస్రారకమలంలో పాదుకాంత దీక్ష అని అంటారు. అక్కడ గురుపాదుకలు ఉంటాయి. ఎడమపాదం ఒకటి, ఇంకొకటి

కుడిపాదం-ఆ రెండుపాదుకలను ఆశ్రయిస్తాడు. వాటిని ఆశ్రయించినప్పుడు లోకం అతనికి జ్ఞాపకం ఉండదు. సుఖదూఃఖాలుండవు. అటువంటి స్థితిని పొందుతాడుకాని ఆ పాదుకలు, రెండుపాదములు ఒక వస్తువులో ఇతడిని లయంచేస్తాయి. ధ్యానశ్లోకంలో మనం 'యదంఘ్రి కమలద్వంద్వం ద్వంద్వతాప నివారకం' అంటాము. రెండింటినీ ఆశ్రయిస్తాము. 'రెండు' అనే దు:ఖాన్ని పోగొడతాయి అవి. మనకుండే దు:ఖం అంతాకూడా; తపన, తాపము అంతాకూడా ద్వంద్వముల చేతనే, సుఖదు:ఖములని రెండుండటం చేతనే ఉన్నాయి. ఏ రెండిటినీ ఆశ్రయిస్తే రెండు అనేభావన నశిస్తుందో అవే గురుచరణములు. ద్వంద్వత్వనివారకమయిన చరణద్వంద్వాన్ని ఆశ్రయించాలి.

61. భ్రమరగీతల తాత్పర్యం ఏమిటంటే, కృష్ణపరమాత్మ అన్నిటికీ అనుష్ఠేయ వస్తువు, ధ్యేయవస్తువు మాత్రమే అవుతున్నాడే తప్ప, అతడు క్రియాశూన్యుడని మళ్ళీ పునరుక్తిగా చెప్పబడుతున్నది భాగవతంలో. గోపికలందరికీ, నందయశోదాదులకు ప్రేమాస్పదుడై, ఇష్టుడై; వాళ్ళయొక్క మమకారానికి, ప్రేమకు, మోహానికి అన్నిటికీ కారణభూతుడై ధ్యేయవస్తువుగా ఉన్నాడు. ఇంతమందిని వదిలిపెట్టి వెళ్ళేటప్పుడు ఒక రోజుముందుకూడా, మరునాడు తానువెళుతున్నట్టుగాకూడా ఎవరికీ చెప్పలేదాయన. "నేను మిమ్మల్ని వదిలి ఆ ఊరు వెడతాను. మళ్ళీ ఎప్పుడో కలుసుకుందాము"- అనే ఇట్లాంటి మనుష్యభావనలు కలిగిన మాటలు, సంఘటనలు వాళ్ళమధ్య లేనేలేవు. సాయంసంధ్యాసమయానికి అక్రూరుడు వచ్చాడు. ఉదయపు సంధ్య అయిపోగానే తీసుకొనివెళ్ళిపోయాడు. కృష్ణపరమాత్మ వెనక్కు తిరిగిచూడలేదు. ఎవరిదగ్గరా సెలవు తీసుకోలేదు. నందయశోదాదులకుకూడా నేను మళ్ళీ వచ్చి మీ దర్శనంచేస్తాను, మీరు దు:ఖపడకండి అనే ఉపచారవాక్యాలేవీ చెప్పనేలేదు.

62. గోపికాగీతల సమయంలో, రాసక్రీడలు వాళ్ళకు ఒకేరాత్రి ఒకేసారి జరిగినట్లు తెలుస్తున్నది. నిరంతరము రాసక్రీడలలో పాల్గొని రోజంతా దాంట్లోనే గడిపారని అందరూ అనుకుంటారు. కానీ అలా జరగలేదు. ఒక రాత్రి సమయంలో వాళ్ళదేహాత్మభావనకూడా వదిలిపోయేంత విరహతాపం పెరిగిన సమయంలో, వాళ్ళకు కలిగిన ఒకానొక ఆధ్యాత్మికమయినటువంటి అనుభవం అది. అంతటితో వాళ్ళ తపస్సు ఫలించింది. ఆ తరువాత ఆయన చిరకాలంలోనే చెప్పాపెట్టకుండా, వీడ్కోలు లేకుండా, రాసక్రీడసమయంలో ఎలా అంతర్ధానమయిపోయాడో అంత హఠాత్తుగా నందవ్రజాన్ని వదిలి పెట్టివెళ్ళిపోయాడు. అట్లాంటి నిస్సంగత్వం

కృష్ణావతార చరిత్రలో చివరిఘడియలవరకూ కానవస్తుంది. దానిని గురించి చెప్పింది భాగవతం. అష్టమహిషులున్నారు. ఆయన ద్వారకను వదిలిపెట్టే సమయం వచ్చింది. యాదవవంశములన్నీ కూడా పరస్పరము కలహించుకొని తాగుబోతులై పాడైపోయి , పతితులై ఒకరినొకరు పొడుచుకొని నాశనమై చచ్చిపోయారు. అది నివారించటంకూడా సాధ్యంకాలేదు. ద్వారకను వదిలిపెట్టి వెళ్ళేటప్పుడుకూడా, ఏ భార్యకూ చెప్పకుండానే వెళ్ళిపోయాడని చెపుతున్నది భాగవతము. ఇంత ప్రేమ ఉన్న అష్ఠమహిషులను పిలిచి, 'నేను వెళ్ళిపోతున్నాను మీరు జాగ్రత్తగా ఉండండి' అని అప్పగింతలు చేసాడా? లేనేలేదు. ద్వారకను విసర్జించినప్పుడు కూడా ఆయన ఎవరికీ ఏమాటా చెప్పనేలేదు. మౌనంగా వెళ్ళిపోయాడు.

63. **ఆయనకు రాసలీలలు అంత ఇష్ఠమై ఉన్నప్పుడు అది నడుస్తూ ఉండగానే ఎందుకు అంతర్ధానమైపోతాడు! మనుష్యుడికి, మనుష్యస్థితికి అతీతమైన; మనుష్య ఇంద్రియములకు, మనసుకు గోచరంకానటువంటి అతిమానుషత్వం ఒకానొక క్షణమందే వీళ్ళయొక్క తపస్సుకు ఫలంగా పర్యవసానంగా కొన్ని ఘడియలు వాళ్ళకు అనుభూతిగా కలగడం; అర్ధమయ్యేలోపలే అంతర్ధానమవటం యథార్ధమయిన ఈశ్వరతత్వం. అది ఆ కృష్ణావతారంలో చాలా స్పష్టంగా ప్రత్యక్షంగా, రూఢీగా రుజువుచేయబడింది భాగవతంలో.**

64. **మూర్ఖులు – "ఆయన ఒక మనుష్యుడే! ఆయనకు ఈశ్వరతత్వం వీళ్ళు అంటగట్టారు!మొట్టమొదట ఆయన ఏదో ఆటవిక తండాల నాయకుడు" అంటూ విమర్శించారు. అట్లాంటివారు ప్రచారంచేసిన చరిత్రలనే చదవటం మొదలైనటువంటి నేటి ఈ పాడునాగరికతలో, తత్వ సుబోధకమైనటువంటి గ్రంథమును చదువవలసిన ఆవశ్యకత ఉన్నదికాబట్టి, ఈ విషయాన్ని ఎప్పుడూ గుర్తుపెట్టుకొని భాగవతాన్ని చదవాలి.**

65. నృసింహస్వామి అవతారంలోకూడా ఆయనకు ఆ శరీర నిర్మాణమంతా ఎవరిచ్చారంటే, హిరణ్యాకశిపుడే ఇచ్చాడు. ఉదయము, సాయంకాలము పనికిరాదు. పగలు, రాత్రి పనికిరాదు చంపటానికి. భూమిమీద, ఆకాశంలో చంపకూడదు. నీటిలోనూ, భూమిమీద చంపకూడదు. ఈ ప్రణాళిక అంతాకూడా అతడిదే! చంపేవాడు దేవతా కాకూడదు, మృగము కాకూడదు, ఏదీ కాకూడదు అని షరతులన్నీ కచ్చితంగా, నిర్దుష్టంగా ఎలా నిర్ణయంచేసాడో; పాపం విష్ణువు

ఆయన అలాగే రావలసివచ్చింది. తాను చేసుకొన్న నిర్ణయం ప్రకారం, అక్కడ కూడా తానే కర్త. ఆ అవతారం ఎత్తడం అనేది విష్ణువు క్రియ కాదు. ఇలాగతప్ప మరొకలాగ రావటానికి వీలులేదని హిరణ్యకశిపుడే విష్ణువుకు ఒక ప్రణాళిక ఇచ్చాడు. పాపం అన్నిటినీ పాటించి విష్ణువు అలాగే రావలసివచ్చింది.

66. అక్కడ స్వయంకర్తృత్వం ఈశ్వరునికి లేదని, ఈతడి యొక్క కర్తృత్వం, ఈతడియొక్క భావనే ఆ ప్రకారంగా వచ్చిందని; ఈశ్వర తత్వమును ఇలాగే అర్థం చేసుకోవాలి. ఈశ్వరుడికి ఒకానొక సంకల్పం, అనుగ్రహము, నిగ్రహము, ఆగ్రహము ఏమీ ఉండవు. చెరువులో నీళ్ళు వాడుకొనేవాడు పశువులను కడిగేవాడయినా, అర్ఘ్యప్రదానాలిచ్చేవాడయినా, ఇంకొకడెవరో బట్టలుతికేవాడయినా చెరువుకు ఏభావనా ఉండదు. ఒకడు సద్వినియోగం, ఒకడు దుర్వినియోగం. ఒకడు మురికిపోగొట్టుకుంటాడు. ఇలాగే వాడుకుంటారు చెరువును. కాబట్టి భాగవతం ఈశ్వరతత్వాన్నికూడా ఇదేవిధంగా గోచరింపచేస్తోంది. ఈ విధంగా ఈశ్వరతత్వాన్ని అర్థం చేసుకోవాలి.

67. నృసింహావతారానికికూడా, అందులోని తత్వమే దివ్యత్వము. హిరణ్యకశిపుడు ఎలా కోరుకున్నాడో, ఆయన అలాగే వచ్చాడు. ఈశ్వరుడికి వీడిని అనుగ్రహిద్దాము, వీడిని చంపుదాము అని ఏమీ ఉండదు. అవతారానికి కారణంకూడా అధికార ప్రారబ్దమే అని చెప్పినట్లు-ఆ అధికారం విష్ణువుమీద వీళ్ళే పెట్టారు. ఆయనలాగే నెరవేర్చాడు. ఆర్తులను రక్షించవలసిన బాధ్యత తమమీద ఉంది అని మునులు, యోగులు భావించారు. ఆర్తిలో ఉండే మానవులు పడుతుండేటటువంటి కష్టాలు తీరడటంకోసం, ఈశ్వరుడియందు ఆ లక్షణాన్ని ఆపాదించి, భావనచేసి ప్రార్థిస్తారు ఋషులు. వీళ్ళ కర్మక్షయం కోసం, వీళ్ళప్రార్థనకనుకూలమయిన అవతారాన్ని అతడు-ఆ తత్వము-ఎత్తుతుంది. ఆ తత్వానికి సహజమయిన విభూతి లక్షణం ఇది. దాని ఐశ్వర్యం అట్లాంటిది. ఎవరు ఏరూపంలో దానిని ధ్యానిస్తారో అలా ఆ రూపంలో ఆయన కనపడవలసిందే! ఆ కార్యం నెరవేరిపోతుంది. ఆ కార్యనిర్వహణ చేస్తున్నప్పుడు ఎవరియందూ మమకారం కాని, ఏమీ ఉండదు, ప్రత్యేకానుగ్రహంకాని, ఆగ్రహంకాని ఉండదు. ఆయన అవతారాలను పరిశీలిస్తే ఈ సత్యం మనకు స్పష్టమవుతుంది.

68. అందుకనే రాముడు రావణాసురవధలోకూడా అతడిని ద్వేషం లేకుండానే చంపాడు. రాముడు యుద్ధం చేసి చంపినవాళ్ళు అనేకమంది. లోకంలో

పరాక్రమశాలురైనవారు యుద్ధాలలో అనేకమందిని సంహరించారు, దుష్టులను చంపారు. కాని వాళ్ళు క్రోధంతో ఈ పనిచేసారు. కాని రాముడు రావణుని క్రోధంతో సంహరించలేదు. రావణుదిమీద రాముడికి కోపమే ఉండి ఉంటే, "ఓ రావణా! ఇవాళ అలసిపోయి ఉన్నావు. ఇప్పుడు నాతో సమానంగా యుద్ధంచేసే స్థితిలో లేవు. రేపు పొద్దున్న యుద్ధం చేద్దాం! ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకో" అని అంటాడా! కొంచెం అలసిపోయినట్లు కనబడితే పదిబాణాలు ఎక్కువవేసి చంపడూ! ద్వేషమేలేదు. అందుకని ద్వేషంకాని, ప్రేమకాని రెండూలేనటువంటి లక్షణమది.

69. అయితే దశరధుడు పోయినప్పుడు దు:ఖపడ్డాడు. దశరథుడియొక్క మమకారమే అతడి దు:ఖం. ఎక్కడికక్కడే సమన్వయం చేసుకోవాలి. "నన్ను గురించి ఇంత బెంగపెట్టుకొని చనిపోవడానికి హేతువును నేనయినానే!" అని దశరథుడిమీద జాలితో దు:ఖపడ్డాడు. "ఇంత మమకారం నామీదకదా పెంచుకొని ఆయన చనిపోయినాడు!" అని బాధపడ్డాడు. అది దశరథుడికి తనపై ఉన్నటువంటి మమత్వాన్నే ప్రతిబింబించింది. సీతపోయినప్పుడు దు:ఖపడ్డాడు కదా మరి, అంటారు. నిజమే! మానవుడిగా అతడియొక్క వర్ణన అలా ఉంటుంది. తాత్కాలికంగా అదే అక్కడే రెండోవైపు తిప్పితే, తాత్వికంగా ఉంటుంది. "నీతో నీవెంబడి ఉండేటట్లయితే నాకు ఆపద ఎక్కడిది? అడవికి రావద్దంటావు. జంతువులున్నాయంటావు. పెద్దపులులు, రాక్షసులు ఉన్నారంటావు. నీ వెనకాల వస్తే నాకు ఆపదే ఉండదు. నీ మీద భారం పెట్టుకొని నేనొస్తాను" అనేకదా సీత అన్నది అని అర్థం. కాబట్టి ఆమెకుండేటటువంటి ధైర్యం విషయంలో, తనవల్ల ధర్మలోపంలోంచి వచ్చిన దు:ఖం రాముడి తత్వంలో ఉంటుంది. ఇలాగ పురాణాన్ని మనం తాత్వికార్థంలో గ్రహించినప్పుడే, దానివల్ల మనకు లోపల ఈశ్వరతత్వాన్ని గురించిన ఒక విలక్షణమయిన జ్ఞానము, వివేకము పుడుతుంది.

70. కపిల సాంఖ్యం ఇలా ఉంది, 'అత్మడనే వస్తువు ఒకటి లోపల ఉన్నది. అది పరమాత్మయొక్క ప్రతిబింబమే! యథార్థంగా దుఃఖమేమీలేదు. గర్భవాసదుఃఖము, జన్మవ్యధ, బాల్యంలో ఉండేటటువంటి అజ్ఞానము, రాగము, క్లేశము, వార్ధక్యము వీటివలన కలిగేటటువంటి దుఃఖములేవయితే ఉన్నవో అవన్నీ తెలుసుకున్న, తరువాత, అన్నీవస్థలూకూడా దుఃఖములే అనేవిషయాన్ని గుర్తుపెట్టుకోవాలి. యౌవనం చాలామంచిది, వార్థక్యం చాలా చెడ్డది అని అనుకోవటము అజ్ఞానము". ఇతరులయందు ఆధారపడితే వచ్చేటటువంటి

దుఃఖములన్నీకూడా దుఃఖములే! అన్ని అవస్థలూ దుఃఖములే! దుఃఖహేతువులే! దుఃఖమయములే! అని ఈ విషయములను గుర్తెరిగి సంగబుద్ధిని వదిలిపెట్టి, ఆత్మడియొక్క నిజస్వరూపాన్ని తెలుసుకుని మోక్షాన్ని పొందాలి. ఆత్మడు అంటే లోపల ఉండే యథార్థ వస్తువు.

71. కపిలుడు భక్తి మార్గంకూడా చెప్పాడు – తామసభక్తి, రాజసభక్తి, సాత్వికమైన భక్తి. నిత్యమూ హింసాపరుడై, దంభమాత్సర్యముకలిగి భేదదృష్టితో ఉండికూడా భగవద్భక్తుడు కావచ్చు. అంటే తనప్రయోజనంకోసమని ఇతరులని ద్వేషిస్తూ, అజ్ఞానంలో భవంతుడిని భక్తితో ఆరాధించవచ్చు ఒకడు. విషయసుఖాలు పొందుతూ, ఐశ్వర్యాలను అనుభవిస్తూ, అంతాబాగుండికూడా భగవంతుడియందు భక్తిని విడవనేవిడవనివాడు రాజసభక్తుడు. ఏ కష్టమొచ్చినా ఇది కర్మక్షయమవుతున్నది అనుకుంటూ, జనహిత మైనటువంటి-ఏదో మంచిపని-ఏదోవిధంగా చేస్తూ, సమస్తకర్మలను భగవంతుడి యందు అర్పిస్తూ కర్మలుచేస్తూ ఉండేవాడు, భగవంతుణ్ణి సేవిస్తున్నవాడు సాత్వికభక్తుడని కపిలుడు చెప్పాడు. ఇక తామసభక్తి- క్రూరకర్మలుచేస్తూ భగవంతుణ్ణి ఎందుకు ఆరాధిస్తాడు? అంటే, ఫలాపేక్షకోసమే. ఆ మాట చెప్పనే అఖ్ఖరలేదు. "నేనివాళ దొంగతనానికి వెళ్తాను. పోలీసులకిదొరకకూడదు. నేను ఎవరి ఇంట్లో దొంగతనం చేస్తానో ఆ ఇంట్లో వాళ్ళంతా ఒళ్ళు తెలియకుండా నిద్రలో పడిఉండాలి. అది నీదయ" అంటాడు ఒకడు. అదోకోరిక! మరి వాళ్ళమాట ఏమిటి? వాళ్ళమీద ఈయనకు దయఏమీ ఉండనఖ్ఖరలేదా? అంటే ఉంటుంది. వాడు తామసి. తన స్వలాభమే చూసుకుంటాడు. తామసభక్తునియొక్క లక్షణం అలా ఉంటుంది.

72. అహంకారం ఉన్నచోట, ఏదైనా అహంకారాన్నే వృద్ధిచేస్తుంది. కానీ అహంకారాన్ని చంపగలిగిన శక్తి ఇంకొకటిలేదు. అహంకారం ఉండేవాడికి, యౌవనం అహంకారాన్ని వృద్ధిచేస్తుంది. అందులో కాస్తంత అందము, చందము ఉంటే వాడుదానివలన మరీ విర్రవీగిపోతాడు. కాస్త తెలివితేటలుంటే, అది ఆజ్యం పోసినట్లు ఇంకా అంతఎత్తున పెరుగుతుంది. భగ్గునమండుతుంది అహంకారం. కాస్త విజ్ఞానాన్ని సంపాదించుకున్నాడంటే, అహంకారానికి ఆజ్యంపోసినట్లు ఇంకా అగ్నిశిఖవలె మండుతుంది. ఏ మంచివస్తువు లభించినా అంతే! భగవంతుడు స్వయంగా వచ్చి ఎదురుకుండా ఉంటేకూడా అతడిని తన అహంకారంతో అవమానించే ప్రయత్నం చేస్తాడు. అహంకారానికి ఈ సృష్టిలో మందులేదు. దాన్ని దురహంకారం అంటారు.